

శ్రీగురుభ్యోనమః.

# అఘవినాశశతకము.




కృష్ణాజిల్లా బేతవోలు గ్రామకాపురస్థులగు

శ్రీమాన్ శ్రీపతి సుదర్శనాచార్యులవారి

ప్రియశిష్యుండగు

## దాసరి అంజదాసు

విరచితము.





ఆదిపూడి ( బాపట్ల తాలూకా )

# చందాదారులు.

ఆదిపూడి.

| | | |
|---|---|---|
| మహారాజశ్రీ | ఆదిపూడి వీరరాఘవయ్యగారు | రు 1-0-0 |
| ,, | ఆదిపూడి వెంకటరాఘవయ్యగారు | రు 1-0-0 |

నాగులుపాలెం.

| | | |
|---|---|---|
| ,, | కొప్పరపు రాఘవయ్యగారు | రు 2-0-0 |

ఆదిపూడి.

| | | |
|---|---|---|
| ,, | బండారు వెంకటప్పయ్యగారు | రు 2-0-0 |
| ,, | బండారు సంజీవిగారు | రు 1-0-0 |

# పోషకులు.

ఆదిపూడి.

| | | |
|---|---|---|
| మహారాజశ్రీ | దాసరి ప్రకాశంగారు | రు 1-0-0 |
| ,, | దాసరి మాధవరావుగారు | రు 1-0-0 |
| ,, | దాసరి వెంకటేశ్వర్లుగారు | రు 1-0-0 |

చీరాల.

| | | |
|---|---|---|
| ,, | దాసరి అప్పయ్యగారు | రు 4-0-0 |
| ,, | కొప్పోలు చలపతిరావుగారు | రు 3-0-0 |
| ,, | పుప్పాల నాగభూషణంగారు | రు 2-0-0 |
| ,, | యల్లసిరి నాగభూషణంగారు | రు 2-0-0 |

# అభిప్రాయము.



రాముఁడె దైవమున్ సఖుఁడు రాముఁడె నాకు పరాత్పరుండు శ్రీ
రాముఁడె నాదు భ్రాత యఖిలాఘములన్ నెగజిమ్మి సాధులన్
బాములపాలుసేయక శుభంబులొసంగి తరింపజేయు త
న్నామమె నాజపంబు భువనంబున నన్యములేదు నాకికన్॥

అని తొల్లి త్రేతాయుగంబున భక్తశిఖామణియగు ఆఅంజదాసు వాక్రుచ్చె. అట్టులే నీగ్రంథకర్త నామంబును; భావంబును తెలియవలెనన్న యీ "అఘవినాశ శతకమె" సాక్షి.

మఱియు వీరెల్లప్పుడును రామపాదారవిందంబుల డెందంబుననుంచి భక్తినైపుణ్యములచే జేయుభజనవల్ల పులకాంకిత శరీరుడై రామప్రసాదంబుగా నీగ్రంథమును బడయ గల్గి పామరుల పాపపంకిలంబు బాఱద్రోలుటకోయన నీగ్రంథము మనకరంబుల నందజేసె.

గాన, సోదర సోదరీమణులెల్లరు "చెఱకునకు వంక గలదేని చెడునెతీపి" యన్నట్లు గ్రంథమునందుండు తప్పులనే ఏడయక భక్తిభావముతో గ్రంథకర్తకు జేయూత నొసంగుదురని ప్రార్థన.

ఆదిపూడి వెంకట రాఘవయ్య.



# పరిచయము.

ఈగ్రంథముపేరు అఘవినాశ శతకము. గ్రంథకర్త అఖిలాఘములజిమ్ము రఘురామ పాదారవింద షట్పదుడగు అంజదాసు. గ్రంథము వ్రాయబడినయుగము కలితకల్మష సంఛన్నమగు కలియుగము.

అగుటచే గ్రంథప్రాశస్త్యమును గూర్చిగాని, గ్రంథకర్తనైపుణ్యమును గూర్చిగాని విపులవ్యాఖ్యానము త్యాజ్యము. భక్తితత్పరులగు పాఠకులేయుందలి మకరందమును గ్రోలుదురుగాక.

గ్రంథకర్త చదువుల యానుపూర్వికముగ గుత్తగొన్న కులములోని వాడుగాడు. వ్యభిచార కళంకముచే నాంధ్రమాతను యవనతశిరస్కగా నొనర్చినకులమందు — రాళ్ళలో నిరత్నమువలె; బురదనీటబుట్టు పూజ్యకమలముభాతి—జన్మించినాడు. సంఘసంస్కారి. నిరాడంబరజీవి. ఉదారాశయుడు. భక్తుడు. ప్రేమోపాసకుడు. విద్యాధికుడుగాడు. చదువులయందాశమెండు. అవకాశములుతక్కువ. స్వేచ్ఛమై యవ్యక్తమధురగానము నాలపించి మైమఱచి సంతసించు శకుంతి సంతానమురీతి పరాత్పరునియందు తనకుగల భక్తివిశేషమును; యనుదినము తానుజూచు లోకచర్యలను; భక్త్యావేశముచే పాడి భక్తలోకమున కీగ్రంథరూపమున నివేదించుకొనినాడు గానివేరుగాడు.

ఇక గ్రంథమునుగూర్చి కొలదిగా నెఱుకపఱచి విరమించెద. ఈశతకము రెడ్డికవి సార్వభౌముని వేమనశతకమును దాదాపు పోలియున్నది. వేమనకు పిమ్మట నీశైలిగల శతకము లగానము. ఇందలి శబ్దవ్యాకరణాది దోషములమాట యప్రస్తుతము. ఏలయన? ఒకానొక భక్తుడు భక్తిభావ ప్రేరితుడై పరాత్పరుని లీలాగాన మొనర్చుచుండ పండితప్రకాండము శబ్దవ్యాకరణ ఛందశ్శాస్త్రముల వెనుకవేసికొని వచ్చియడ్డగించుటకేటి హక్కుగలదు? భక్తకవులకును పండితులకును యంతరము విస్తారము. అట్టిచో నీగ్రంథము పామరకవి భక్తునిచే సృష్టించబడినది. గాన యీభక్తుని లీలామధురగానమందుండు రసవృష్టిని మాత్రము గ్రహించి, శబ్దసంస్కారము వగైరాలకై ప్రాకులాడకుడని ప్రార్థన-సెలవు.

ఆదిపూడి, 12-5-32.

పరిచయకర్త,
అబ్బరాజు వెంకట రంగారావు.

# అఘవినాశశతకము.

శ్రీ యేజనులకురత్నము
శ్రీ యేబహుసంపదలను జేకూర్చునగుణ
శ్రీ యేభక్తికి మూలము
శ్రీ యేరక్షించుజనుల శ్రీ రఘురామా ॥

గొప్పబొజ్జయయ్య గుణములమాయయ్య
తప్పులెల్ల ద్రోసిదారిజూపు
గొప్పవాడవనుచు కొనియాడెదనుసుందు
అంజదాసపోష అఘవినాశ ॥

వాక్కునందునాకు వసియించి మాతల్లి
చక్కనైనభాష జాలనొసగు
ధిక్కరించబోకు దీనుడనేతల్లి ॥అంజ॥

వేమనాప్యులందు వేనభక్తులయందు
పూర్వకవులయందు బుద్ధినిల్పి
సార్వభౌములంచు సాగిలిమ్రొక్కెద ॥అంజ॥

నీలవర్ణుడైన నిఖిల ధాముండైన
బాలురామచంద్రుదు భక్తిగొలచి
అఘవినాశశతక మర్పించితిని నీకు ॥అంజ॥

# అఘవినాశ శతకము.

ధనములిచ్చినిన్ను తనియింపగాలేను
మనసునిల్పి నీదు మహిమదెల్ప
బూనుశతకపద్య పుష్పంబులిచ్చితి ॥అంజ॥

తప్పులైనగాని ఒప్పులైననుగాని
మెప్పులైనగాని మిమ్మునమ్మి
చెప్పియుంటినయ్య శ్రీ రఘురామయ్య ॥అంజ॥ ౧

గురునిజేరిమ్రొక్కి గుర్తందగాలేక
గుణవికారమింత కూడబెట్టి
తిరుగువారికెట్లు దీరునుకర్మంబు ॥అంజ॥ ౨

కపటవృత్తిచాల గలిగినవారలు
భక్తులెట్లు? పాపభటులజట్టు
వీరినుండినన్ను విడిపించిరక్షించు ॥అంజ॥ ౩

సేవజేయువాని జిక్కుల బెట్టుట
భావ్యమేననీకు భక్తవరద
త్రోవజూపనాకు దొలగించుబాధలు ॥అంజ॥ ౪

మోసపుచ్చకయ్య ముద్దుల మాయయ్య
దోసిలొగ్గియుంటి త్రోవజూపు
దాసదాసుపైని దయయుంచిరక్షించు ॥అంజ॥ ౫

కాయమందునిన్ను గనుగొనలేకను
సేయుచుంద్రుపూజ జనులుభువిని
ప్రాయమెల్లయిట్లు పాడుజేయుటదేల ॥అంజ॥ ౬

ఎన్నిజన్మలెత్తి యీజన్మకొచ్చితో
కన్నతండ్రి నన్ను కరుణజూడు
చిన్నతనముచేత జేసితిపాపముల్ ॥అంజ॥ ౭

దేహభ్రాంతిచేత దేవుని గనలేక
మోహబాధజిక్కి మోసపోతి
యిహపరంబులేని యీజన్మమేలయా ॥అంజ॥ ౮

భక్తిలేనివారు పరమనీచులబోలు
యుక్తిలేకయున్న యూరకుక్క
వ్యక్తిలేనివాడు వ్యర్థమైపోవురా ॥అంజ॥ ౯

నీతికన్న వేరె జాతియందునులేదు
ఖ్యాతికన్న వేరె కాంతిగలదె
నాతికన్న గలదె నాణ్యమాయందము ॥అంజ॥ ౧౦

జీవహింసజేయ దైవ వంచన యౌను
జీవమందు బ్రహ్మజేరియుండు
జీవుబ్రహ్మమందు జేర్చిన సుఖమౌను ॥అంజ॥ ౧౧

అప్పుకన్న వేరె ఆపదేమియులేదు
మెప్పుకన్న భాగ్యమెువ్వదెందు
ముప్పుకన్న వేరె గొప్పకష్టములేదు॥అంజ॥ ౧౨

దాతలున్న యూరు దైవభక్తుల యూరు
భూతదయనుగల్గి బ్రోచుయూరు
భూతలంబునందు బోలును స్వర్గంబు ॥అంజ॥ ౧౩

పప్పు యన్నములవి పరమేశ్వరుని రూపు
ఉప్పు పులుసు నెయ్యి హృదయగుణము
గొప్పకూరలన్ని గోవిందుభూతముల్ ॥అంజ॥ ౧౪

త్రిపుటిమధ్యనుండు దేవుని గనుగొంటె
అపుడెయోగుతౌదు రయ్యలంత
దాపుజేరి గురుని దానిని గనవైరి ॥అంజ॥ ౧౫

ధనము యెవరిసొమ్ము దాస మెవరిసొమ్ము
మనసు యెవరిసొమ్ము మహిని జనులు
ఘనులమనుచు దిరిగి ఘననీచులయ్యేరు ॥అంజ॥ ౧౬

తల్లికన్న వేరె దైవమెక్కడజూడ
కల్లుకన్న నీచకైపులేదు
యిల్లుకన్న లేదు యిలక్షేత్రముల త్రోవ ॥అంజ॥ ౧౭

ఆలికన్న వేరె ఆత్మబంధువులేదు
కాలికన్న లేదు గట్టిబంటు
పాలుకన్న వేరె ఫలమెందుగలదయా ॥అంజ॥ ౧౮

జాతినెంచువాడు నీతినెన్నని వాడు
జాతినీతిలేని కోతివాడు
నాతినెంచువాడు నరజన్మమెట్లౌను ॥అంజ॥ ౧౯

కామక్రోధమందు కనకంబునందును
తామసంబు స్త్రీల దలచుటందు
నీమ మెల్లవిడువ నిందలపాలౌను ॥అంజ॥ ౨౦

మోహబాధచిక్కి మునుగుచుండేవారు
దేహసుఖములెట్లు దెలిసికొనగలరు!
సాహసంబువిడక సరసులెట్లాదురు? ‖అంజ‖ ౨౧

దేశభక్తికొఱకు దేహమర్పించెడి
భూసురోత్తములను బొగడదగునో?
మాంసకండలమ్మి మాలిన్యకాంతల
పొగడదగునో? మీరెపోల్చుడయ్య ‖అంజ‖ ౨౨

అన్నదమ్ములైన ఆలిబిడ్డలైన
కన్నతల్లియైన గాంచబోరు
ధనములేనివేళ దైవమేదిక్కగు ‖అంజ‖ ౨౩

అట్టివారునేడు యగుపడరెందైన
యెట్టిజన్మమరయ యెంచలేము
తిట్టికొట్టుకొనుచు తిప్పలు బడెదరు ‖అంజ‖ ౨౪

మనుజపుట్టువందు మహిమీదజన్మించి
వచ్చివరములిచ్చి వసుధనేలె
తెచ్చిరామనామ తేజంబువిరజిల్లె ‖అంజ‖ ౨౫

పుట్టగానె మిగుల భూతదయతో దర్గె
పట్టి విల్లువిరచి ఫలముగాంచె
యట్టిపురుషశ్రేష్ఠు డాపదదొలగించు ‖అంజ‖ ౨౬

పాపుడయినగాని భక్తుడయినగాని
లోభుడైనగాని రోగిగాని
డాపుజేరమ్రొక్క దరిజేర్చు రాముండు ‖అంజ‖ ౨౭

సభను ద్రుపదపుత్రి శరణార్థయైవేడ
అభయమిచ్చివేగ యతివబ్రోచె
సకలపరచె కోర్కెచక్కని హాల్యకు ॥అంజ॥ ౨౮

దాశరథిని సతము దలచెడి జనులకు
దోషరహితమైన త్రోవదొరకు
ఆశవిడువకున్న అతిపాపులయ్యేరు ॥అంజ॥ ౨౯

అన్నదమ్ములయెడ నత్తమామలపోరు
కన్నతల్లిపోరు కాంతపోరు
యున్నవారియిల్లు యెన్నగ తరమానె ॥అంజ॥ 30

దానమందుగొప్ప దైవమందునగొప్ప
మానమందుగొప్ప మాటగొప్ప
మనిజుడయినవాడు గనగొన్న ఘనుడౌను ॥అంజ॥ 31

నీటియందు మంచి పాటయందును మంచి
బోటియందు మంచి పొందుమంచి
వాటినెరుగువారి సాటెవ్వరిలలోన ॥అంజ॥ 3౨

కూటమందు మంచి నాట్యమందును మంచి
దీటునందుమంచి తేట మంచి
వాటినెరుగువారు కోటికొక్కరులేరు ॥అంజ॥ 33

భూషణంబుగొప్ప భాషణంబులగొప్ప
వేషమందుగొప్ప వేటగొప్ప
శేషశాయి కైన చెప్పంగతరమానె ॥అంజ॥ 3౪

రోషమందుగొప్ప రోగమందునుగొప్ప
మాటకటువుగొప్ప నీటుగొప్ప
ఆశయందుగొప్ప యదెగంటజేయురా ॥అంజ॥ ౩౫

ధర్మమందు మంచి మర్మమందును మంచి
నిర్మలంబు మంచి నేర్పుమంచి
కర్మవిడువకున్న గనుగొన తరమానె ॥అంజ॥ ౩౬

మహిషమందు గొప్ప మార్జాలములగొప్ప
వాహనంబుగొప్ప వరునిగొప్ప
దేహభ్రాంతిలేక దీనికర్థముగనుము॥ అంజ॥ ౩౭

వారకాంతగొప్ప వైరి వీరులగొప్ప
నారచీరగొప్ప నరునిగొప్ప
సాధనంబులైన సరసుల కెఱుకౌను॥ అంజ॥ ౩౮

మచ్చరంబు మంచి నిచ్చయందును మంచి
పచ్చయందు మంచి ఫలము మంచి
సచ్చరిత్రుడైన సారంబు గుర్తించు॥ అంజ॥ ౩౯

సత్యమందుగొప్ప శౌచమందునుగొప్ప
ముత్యమందుగొప్ప ముక్తిగొప్ప
నిత్యమనుచు దెలియ నిర్వాణపథమబ్బు॥ అంజ॥ ౪౦

ధైర్యమందుగొప్ప శౌర్యమందునుగొప్ప
కార్యమందుగొప్ప ఘనతగొప్ప
ఆర్యులందుగొప్ప జలవియే వర్ణింప॥ అంజ॥ ౪౧

మనుజ జన్మగొప్ప మంచికార్యముగొప్ప
తనువుప్రాణగొప్ప దాతగొప్ప
యనుచు తెలియురీతి నాత్మకు ఘనమౌను॥ అంజ॥ ౪౨

ఆడవారిమంచి అందలంబులమంచి
క్రోడపత్రముమంచి కోతిమంచి
గూఢచారిమంచి గుర్తింపతరమౌనె॥అంజ॥ ౪౩

భోగవంతులైన త్యాగవంతులైన
రోగరహితులైన లోకమందు
యోగభక్తిలేక యుండదుమోక్షంబు॥ అంజ॥ ౪౪

సారమెల్లతెలసి సత్యశీలముగల్గి
వేదమూర్తివగచు వెలసియుండి
సూర్యవంశమందు శుభజన్మమందితో॥ ఆంజ॥ ౪౫

దానమింతలేక దైవభక్తియులేక
పాపభీతిలేక భయములేక
యున్నవానిబ్రతుకు నెన్నగతరమౌనె॥ అంజ॥ ౪౬

కామకాశబెంచి కామ్యకర్మముద్రుంచి
నీటుకాంగ్రదపొంచి నీతిమించి
దోషములను పెంచి త్రోవ గానమువేశ్య ॥అంజ॥ ౪౭

ఇట్టిమరుగుచేత నిలమీద బుట్టించి
కట్టివేసి మమ్ము కర్మ చేత
బట్టిలాగుటేల పరమార్థమివ్వక ॥అంజ॥ ౪౮

కర్మజన్మమిచ్చి కష్టంబులోనుంచ
ధర్మమౌన నీకు దనుజహరణ
సారవంతమైన సత్కృపజూపవే ॥అంజ॥ ౪౯

నిన్ను నమ్మియుంటి నిజభక్తితోనుంటి
నన్ను జూడమంటి నారసింహ
పన్నగేంద్ర తల్ప బాధలు దీర్పరా ॥అంజ॥ ౫౦

బాధపెట్టకయ్య భక్తుడ నీకయ్య
వాదమాడకయ్య వందనములు
బంధనంబుబాపి పాలించవేమిరా ॥అంజ॥ ౫౧

తిప్పలేల నాకు తీర్చవా భువిలోన
గొప్పవాడవనుచు గోరియుంటి
తప్పులున్న గాచి దయయుంచు నాయెడ ॥అంజ॥ ౫౨

వంతగించి నీవు పలుకరించగబోకు
చింతనొందియుంటి శ్రీనివాస!
ఇంతకష్టమేల యిటులొచ్చెబ్రోవుమా ॥అంజ॥ ౫౩
నేనుజేయుపనులు నెరవేర్పవెందుకో
పన్నగేంద్ర తల్ప పలవతనను!
నిన్ను నమ్మియుంటె నిరసించ సరసమా ॥అంజ॥ ౫౪
ఎన్నిరోజులిట్లు యిడుములబెట్టుట
కన్నతండ్రి నీకు కరుణరాద!
చిన్నవానిపైని జెల్లునే పంతంబు ॥అంజ॥ ౫౫

ఆశ్రయించి నిన్ను అడుగుచుంటేనేను
శాస్త్రవాదమేల జయకృపాల
అస్త్రశస్త్రవిద్య లటుజేయుచుంటివా ॥అంజ॥ ౫౬

తంత్రగానివోలె దానిదీనినిజేర్చి
ఇంద్రజాలమెల్ల యిలనుజూపి
మంత్రమహిమచేత మమ్ముగట్టివేయకు ॥అంజ॥ ౫౭

గారడివనివల్ల కట్టివైచియుమమ్ము
కోరుదానిజూపి కోర్కెదీర్చి
చూరబెట్టినీదు సూక్ష్మంబు దెలుపవు ॥అంజ॥ ౫౮

దొంగవానిబోలి త్రోవదప్పెదవేల
భంగమొచ్చునీకు బాపనయ్య
దిక్కునీవెనాకు దీర్చుమీబాధలు ॥అంజ॥ ౫౯

సందుగొందులందు సావిళ్లుసత్రాలు
తిరిగితిరిగి తుదకు దిక్కులేక
బొందినుండి పోవబోవునా నీదిక్కు ॥అంజ॥ ౬౦

చక్కదనముజూచి చాలభ్రమలోజిక్కి-
నిక్కుచుండునట్టి నీటుగాండ్ర
దిక్కుజూచి నీవు దిరుగుచుంటివయేమి ॥అంజ॥ ౬౧

మాయనీదిగాక మరియెవ్వరిదిలేదు
సేయుచుంటివిట్లు చిత్రములను
కాయమందుయుండి గారడిజేసేవు ॥అంజ॥ ౬౨

ఆశలోనఁజిక్కి యానంద మొందుచు
వేషమేసియున్న వెఱ్ఱిజనులు
మోసమొచ్చువఱకు మూలంబు దెలియరు ॥అంజ॥ ౬౩

ఎంతో చిత్రమైన వేషంబుధరియించి
భూతలంబునందు భుక్తికొఱకు
పాతకంబులెన్నో బహుళజేయుచుండేరు ॥అంజ॥ ౬౪

తోలు తిత్తిలోని దొడ్డవానెరుగక
కాలమెల్ల రిత్త గడపుచుంద్రు
నీళ్లులేనిచేప నిర్మూలమాగద ॥అంజ॥ ౬౫

భక్తిలేనిభార్య బాధపెట్టునుగాని
శక్తికొలదిసేవ జేయగలదె
వ్యక్తిలేనిదాని వదలివేయుటమేలు ॥అంజ॥ ౬౬

ఎంతో వేడుచున్న యేమిజెప్పవదేల
పంతమేలనయ్య భక్తవరద
నిందపాలుజేయ నీకు జెల్లునటయ్య॥ అంజ॥ ౬౭

పుట్టినట్టిచోటు బొత్తిగా దెలియక
అట్టులిట్టుదిరిగి అదరిపడుచు
గుట్టుగానలేక కూతలుగూసేరు॥ అంజ॥ ౬౮

స్త్రీలకన్న వేరె చిత్తచోరులులేరు
ఎల్లలోకమందు యింద్రజాల
మెల సల్పుచుండి మెలగుచునుందురా॥ అంజ॥ ౬౯

తప్పుజేయునాడు ధైర్యమెక్కువయుండు
అప్పుడప్పుడుండు అతిశయంబు
తప్పుదెలియునాడు తిప్పలువిశదమరా॥ అంజ॥ ౨౦

భార్యరంకుజేసి భర్తనుకోపించి
కార్యమెల్ల నదియె గడుపుకొనుచు
ధైర్యమెంతొజేయ దానికిజెల్లుగా॥ అంజ॥ ౨౧

భోగస్త్రీలు మున్ను పుట్టినప్పటినుండి
బొంకుమాటలెన్నొ ప్రోగుజేసి
రంకులాటయందు రంజిల్లుచుందురు॥ అంజ॥ ౨౨

మచ్చరంబుచేత మహిమగాంచగలేరు
యుచ్చగుంట దీని యునికిజూడ
పచ్చిమాంసపుతిత్తి పరికించిజూడగా॥ అంజ॥ ౨౩

అంటియంటకుండ ఆకాశముండెను
రెంటిమధ్యజూడు రేయిపవలు
యట్టిదానిజూచి యానందమొందరా॥ అంజ॥ ౨౪

రెంటిమధ్యగాను రేచించిజూచితె
ఒంటిస్తంభమేడ యొకటియుండు
అట్టిదానిలోను హాయిగపవళించు॥ అంజ॥ ౨౫

కంటిలోను మంచి గారడివాడుండి
ఆటలాడుచుండె నందముగను
అట్టివానిబట్టికట్టివేసియుజూడు॥ అంజ॥ ౨౬

పాపభీతిలేక పదరుచుండెడివారి
దాపుజేర్చకయ్య తండ్రినన్ను
చూపుజూచినీదు సూక్ష్మంబు దెలుపుము ॥అంజ॥ ౭౭
ఏరుపారుచుండు నేవేళజూచిన
ఆరుచేపలందు యాడుచుండు
నీరుత్రాగవచ్చి నిలచి మింగెనుకొంగ. ॥అంజ॥ ౭౮
మూటిలోనిఛాయ ముప్పతిప్పలుగాను
యేటివెంటబడియు యేగుచుండు
అట్టినీటిలోన యపరంజిస్నానంబు ॥అంజ॥ ౭౯
చంటిబిడ్డనెత్తి జంకులేకనుస్త్రీలు
యెట్టిబానలైన యిలనుజేసి
అట్టివాటిచేత ఆపదలనుఃబొందు ॥అంజ॥ ౮౦
మూటిమధ్యమంచి ముక్తికాంతయునుండి
పాడుచుండునెపుడు భక్తితోను
పాటుపడియుదీని భావంబు దెలియుము ॥అంజ॥ ౮౧
కుక్కలారుగూడి కూయుచుపరుగెత్తి
పక్కనున్నవాని పైనబడియు
జంకులేకతిరిగి చావుకుసిద్ధమౌ ॥అంజ॥ ౮౨
బూటకంబుతోను పురములోపలజొచ్చి
ఆటలాడుచుండె నాదిశక్తి
కోటలోనఃజేరి కొంపతిప్పలుదెచ్చె ॥అంజ॥ ౮౩
దానిమాయజూడ ధాత్రిలోపలనేమొ
యెన్నిమాటలైన నెన్నజేసి
పన్నిబొంకుచుండు పరికింపతరమౌన ॥అంజ॥ ౮౪

మూటిదాటిఅందు మూలంబుదెలుసుక
బాటఁగన్నవాడు పరమయోగి
సాటియెవ్వరయ్య సారమెరిగినయంత ॥అంజ॥ ౮౫
ఆడువారిబుద్ధి అంగడిబోలు తా
గూడబెట్టుచెడ్డ గుణములెన్నొ
చెండివేయకున్న చెప్పినట్లినదురా ॥అంజ॥ ౮౬
భారమంతనీవు బాపెదవనియెంచి
కోరివేడుచుంటి కోర్కెతోడ
భారమేమిలేక భక్తులరక్షించు ॥అంజ॥ ౮౭
లోకనిందలేక లోపమురానీక
సాకుమయ్యతండ్రి సౌఖ్యముగను
ధిక్కరించువారి తిప్పలుబెట్టవా ॥అంజ॥ ౮౮
కండనమ్ముచుండు కాసులకాసించి
చెడ్డవారితోను జేరివేశ్య
దండనేమిలేదు దానికి భువిలోన ॥అంజ॥ ౮౯
కుంటియైనగాని గ్రుడ్డియైననుగాని
రోగియైనగాని రోతలేక
నింటజేర్చువాని నెంతో ప్రేమింతురు ॥అంజ॥ ౯౦
డబ్బులేకయున్న డంబంబుగాయుంటె
నిబ్బరంబుగాను నింటజేర్చు
సబ్బుబిళ్ళరుద్ది సరసుని దరిజేరు ॥అంజ॥ ౯౧
పెండ్లిలేనిస్త్రీలు పేరంటమునకెట్లు
నిండ్లలోనయుంచ నెటులజెల్లు
కండ్లుదెఱచిచూడ గనపడులోపంబు ॥ంజ॥ ౯౨

తాళిలేక స్త్రీల దైవమెట్లు విధించె
తల్లిదండ్రిలేని తనయులట్లు
కల్లయయ్యె వార కాంతలజన్మంబు ॥అంజ॥ ౯౩
ఆంధ్రదేశమందు నన్నిజాతులలోను
యింద్రజాలమయ్యె యిట్టికులము
ఆంధ్రులెల్ల వీరి నాదరించుటతగదు॥అంజ॥ ౯౪
నేను నేనటంచు నీల్గితిరిగె వారు
"నేను" యనెడిదాని నెన్నవలయు
దానిగన్నవాడు ధన్యుడౌ యిలలోన ॥అంజ॥ ౯౫
మాయలోనెబుట్టి మాయలోనె పెరిగి
మాయలోన జచ్చుమనుజులంత
మాయమర్మమేదొ మహిలోన యెరుగరు ॥అంజ॥ ౯౬
భర్తప్రాజలేక బరగెడు స్త్రీలెల్ల
వ్యర్థులయ్యువారు యమునిజేరు
మున్ను పతివ్రతంబు ముక్తి నొసంగదే॥అంజ॥ ౯౭
ఒంటిలోని హోముయున్నంతవఱకును
జంటనంటిదిరుగు సరసులెల్ల
ఒంటిపొంగముడుగ నొక్కరురాబోరు ॥అంజ॥ ౯౮
ఆత్మశుద్ధిలేక యాచారవంతులై
కూయుచుంద్రు చెడ్డకూతలెన్నొ?
భక్తులైనవారి భావంబు దెలియక
అంజనాసపోష అఘవినాశ॥ ౯౯
కంటిలోన పెద్ద గారడివాడుండె
ఇంటిలోనయుండె వేటగాడు

జంటలేకవాడు జరుపుచుండునువింత
అంజదాసపోష అఘవినాశ॥ ౧౦౯

అమలచరితులైన యార్యులెల్లరునన్ను
అంజదాసటంచు యనుచునుండ్రు
ఆదిపూడిగ్రామమందున పుట్టుక
అంజదాసపోష అఘవినాశ॥ ౧౧౦

హీనజాతి శబరి యెంగిలి పండ్లివ్వ
జ్ఞానమార్గమిచ్చి గావలేదె?
దీను డిచ్చుభక్తి దివ్యమాలికగొమ్ము
అంజదాసపోష అఘవినాశ॥

శ్రీరామపాదుకల్ శిరమునదాల్చియు
మోయుచుంటిని నేను ము_క్తికొఱకు
భ_క్తిమీరగ నీకు భవనంబు గట్టించి
అర్పింతు మన్నను ఆ_స్తిలేదు
పొట్టబువ్వకునేను భూములెల్లఁదిరిగి
పడరాని కష్టముల్ పడుచునుంటి
నిర్మలంబుగనేను నీదుసేవనుఁజేయ
ఘర్మదేహము జబ్బుగలిగియుండె
అఘవినాశ శతకమునేడు పుష్పంబులు
అర్పించుచుంటిని అయ్యనీకు
అట్టినీ భ_క్తపరుడనై యనుదినంబు
సేవజేయుచునుంటిని చింతదీర్ప
కామితార్థంబులిచ్చియు కన్నతండ్రి!
—— ... ...నము అఘవినాశ॥

# ఆనందజనామృత కీర్తనలు.

ఈ గ్రంథకర్తచే రచింపబడి అముద్రితముగా నున్న పై గ్రంథమును త్వరలో ముద్రింప యత్నించుచున్నాము. వేదాంతమార్గమును, భక్తిబోధను తేటతెల్లముగా విశదీక రించు గ్రంథములలో నిదియొకటి.

# తత్వబోధ కల్పవల్లి.

ఇదియు అముద్రితమే. ఎడ్లరామదాసుగారి కీర్తనల వలె తత్వబోధామృతము పామరజనులకు సులభముగా లభించు గ్రంథము. తత్వవిచారమం దభిమానముగలవారి చేయూతకు ముఖ్యముగా తగియున్నది.

# అఘవినాశ శతకము.

ముద్రింపబడిన శతకము. వేమన శతకమును బోలి యున్నది. నీతి యపారము, భక్తి యగాధము.

ఈ పుస్తకములు వలయువారు:—

కొప్పోలు చలపతిరావు,

చీరాల అని వ్రాయవలెను.